# పూర్ణబోధ సిద్ధాంత సారామృతము.

—:o:—

బ్రహ్మశ్రీ బొడ్డపాటి వేంకటాచలపతి
గారిచే రచియింపఁబడియె.

మచిలీపట్టణము:

సేతు ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

వండూరి సుబ్బారావుచే

ప్రకటింపఁబడియె.

1915.

శ్రీసద్గురు[illegible]నమః

# పూర్ణబోధ సిద్ధాంత సారామృతము.

—:0:—

శా॥ శ్రీసచ్చిత్సుఖ మద్వయంబతులము న్సిద్ధాం
తమూన్పూర్ణమున్ । భాసాభాస విహీనము
న్పరమము న్బాహ్యాంతరాభేదము । న్వ్యాసా
తీతము సర్వ శూన్యమును మిథ్యారూప
నామాస్పదం । బీసర్వంబు విలక్షణంబగు
పదంబే నంచు సేవించెదన్॥ ౧

సీ॥ సత సదాత్మకముచే సకల లోకములు నేర్ప
డగ నేదేవి తా బరిణమించు । స్త్రీ పు న్న
పుంసక రూపంబు లేతల్లి నిజమందు కల్పించి
నగడుచుండు । గుణసమావస్థచే గొమరొప్ప
నేకొమ్మ సమరసానంద సత్ప్రకృతి నొందు ।
దన మూలమున్గన దా లేకనే జగజ్జనని పూ
ర్ణాత్మపూర్ణ మనగబరగు । నట్టి పరిణామశా
లిని యప్రతర్క్య । తావ్య యానందశీల గుణా
తివేల । యచల పరిపూర్ణ మన యనిర్వచన
శీల । మెలగు తచ్ఛ్రీహా శక్తిని దలచికొలతు॥

వ॥ అని యిట్లు సదసత్స్వరూప జగత్ప్రధాన
మాయా తత్వంబును తద్విలక్షణంబై యాధా
రాధేయ రహితంబగు నిరావరణ పరిపూర్ణాచల
నిర్వాణ పదంబును బ్రార్థించి భవాబ్ధి తరణంబు
లగు సర్వ వేదాంత సిద్ధాంత ప్రకరణంబులు
సర్వజనుల కత్యంతోప యుక్తంబగునటుల దేట
తెనుంగున నొక్క ప్రబంధంబు సేయ సమకట్టి
సవికల్ప దృశ్యంబులకు బీజాంకుర లయంబులు
ప్రతీతి మాత్రంబుగ దోచు నిర్వికల్పంబున నా
మనంబు జేర్చి సహజ జీవబ్రహ్మైక్యాను సం
ధాన ముద్రా ధ్యాన లక్ష్య మనోధారణంబు
లొసంగి స్వస్వరూపానంద నిష్టానుభవంబొసంగిన
మద్గురుండు నారాయణస్వాముల శిష్యుండునగు
పరబ్రహ్మస్వాముల కభివందనంబు లొనర్చి
నారాయణాంశంబులై వ్యష్టి రూపంబున నావ
లన దోచెడి శబ్దజాలంబు లన్తంగతకాలంబున
నాదిత్యునికిరణంబు లాదిత్యుని జేరునట్లు సమ్య
జ్ఞానంబున బ్రహ్మరూపము నొందునట్లగుట నీ
కృతి యీశ్వరోపాస్తిగా నానందించి యేతత్కా
వ్యరచనోల్లాసన మానసుండనై సంక్షేపంబుగ
మదీయ వంశావతారంబు నభివర్ణించెద। 3

౧

గీ॥ బ్రహ్మ మానస పుత్రులై బరగుచున్న।
వర మునీంద్రులలో భరద్వాజ ఋషి స।
గోత్రజులు వేదవిహిత చరిత్రు లార్య।
మిత్రు లనఘులాపస్తంబ సూత్రులిలను॥ ౪

కం॥ వెలసిరి సద్బ్రాహ్మణులన। పలలిత యజ
నాది విహిత షట్కర్మములు। వ్వలువుచు
సద్వర్తనులై। కులఋషి మహిమమున దత్వ
కోవిదులయ్యెన్॥ ౫

సీ॥ అందు సత్కర్మము లొప్పొందుగా జేసి తత్ఫ
లమెల్ల నీశ్వరార్పణము జేసి। మన్ననగని
రాజమంత్రులై రాజ్యవర్తనము లాజ్ఞాపించి
తనరు కతన। నిర్వృతి యుక్తిచే నిపుణత
మెరయ నఘటన సంఘటన ధీపటిమ మెరసి।
ప్రత్యక్షపరోక్ష సంప్రజ్ఞాన యోగ సమా
రూఢ మానసులగుట జేసి। నిర్వ్యయ ప్రజ్ఞ
నొందుచు నిత్యశాంతు। లనఘు లద్వైతు
లార్యులు నఖిలకార్య। భారనిర్వాహకులు
నతిధీరు లమిత। త్యాగులగుదురు భువిని
నియోగి వరులు॥ అందు॥ ౬

ఆ॥ వె॥ ఘనుడు బొడ్డపాటి కామరాజాన కగ్రి
పుత్రుడగుదు పూర్వ పుణ్యమునను।

విశ్వమందు జనులు వేంకటా చలపతి ।
పేరుచేత నన్ను పిలుచుచుండ్రు॥ ౭

ఆ॥ వె॥ చిన్ననాట నుండి చిన్మయాత్ముని కడ ।
కన్నుకవల గురుని కరుణగాంచి । నన్ను
తించి భక్తి సలిపి సేవించిన । యున్న
నిజము మదికి సన్నుపడియె॥ ౮

వ॥ అదెట్లనిన.

కం॥ అంతయు నేనై యుండియు । నంతయు నే
గానివస్తు వరసి తెలియ ము । న్నంతరము
వెలియు లేకను । నంతయు నేనగుదు నట్టి
యనుభవ మగుదున్॥ ౯

వ॥ ఇట్లాత్మారామత్వంబున వర్తించు నా
వలన యనాహత నాదోత్పన్నంబులై వాగిం
ద్రియ ప్రభూతంబులగు నేతత్కావ్య శబ్దంబు
లాద్యంతంబుల నిర్గుణ భావమొందుటచే నీకృతి
బ్రహ్మంబు నం దేకంబై స్థిమితంబై .గంభీరంబై
యిదియు నొక యారాధన విషయంబుగ నెంచి
కృతినాథునకు షష్ఠ్యంతములు వివరించెద॥ ౧౦

కం॥ విద్యా స్వరూపునకు త।ద్విద్యావిద్యాతిరిక్త వి
ద్యాత్మునకున్ । విద్యానంద ప్రదునకు ।
నాద్యునకు ననంత పూర్ణుడైన - ఘనునకున్॥

క౦॥ ధ్యాతృస్వరూపునకు త। ద్ధ్యాతృధ్యానాతిరి
క్తతత్వనకమిత। శ్రోత్రుధ్యానధ్యేయ।ధ్యా
త్రువిహీనునకు పూర్ణత త్వంబునకున్। ౧౨

క౦॥ చిద చిత్కల్పనునకు త చ్చిదచిద్వ్యవహార
సాక్షి చిద్రూపునకున్ । చిదచిత్స్వరూపు
నకు నా । చిదచిత్కల నైక్యశుద్ధచిత్పర
మునకున్ ॥ ౧౩

క౦॥మంత్రస్వరూపునకు త।న్మంత్రార్థజ్ఞానగ
మ్యమానునకు సదా । మంత్రాధిష్టానున
కును । మంత్రైక్యస్థునకు సకలమంత్రజ్ఞున
కున్ ॥ ౧౪

క౦॥ హంస స్వరూపునకు నా । హంసాంతర్గ
తవిశుద్ధ హంసునకు సదా । హంసార్థజ్ఞాను
నకును । హంసైక్యానందరూపి కచలాత్ము
నకున్ ॥ ౧౫

క౦॥ ప్రత్యగభిన్నాత్మునకు । నృత్యాదినులక్షు
ణునకు సర్వజ్ఞునకు । న్నిత్యపరంజ్యోతి
ద। న్నిత్యానందాతిరిక్త నిర్లిప్తునకున్ ॥ ౧౬

వ ॥ అంకితంబుగ నాయొనర్పం బూనిన పూ
ర్ణబోధప్రసిద్ధాంత సారామృతం బను గ్రంథంబున
కు కథాక్రమం బెట్టిదనిన॥ ౧౭

సీ॥ చిన్నాద చిద్బిందు చిత్కళలేకమా తుర్యాతు
ర్యోపాధి ధుర్యు వరుడు॥ వినికి చూపు తలం
పులును నేకముగ జేసి, తనుదానుగాంచు నజ్ఞ
నుడు ఘనుడు॥ యిలశిష్య బోధకు కలలదో
చెడి సింగముగ వచ్చి కడతేర్చు మూలధను
డు॥ స్వప్న ప్రపంచంబు సరణి నెరుంగని స
ర్వజ్ఞునకు సదా సాక్షియగుచు॥ విమల బో
ధానలంబున వివిధరూప॥ ద్వైతగహనంబు ద
రికొల్పి తనరు వాడు॥ సకల వేదాంత సిద్ధాం
త సారమూర్తి॥ యగు గురూత్తము పద పద్మ
యుగము కడకు॥ ౧౮

సీ॥ సంసారగహనసంచారుడై యెవ్వాడు స్మన
ములో నార్తి నిమగ్నుడగుచు॥ కడ గాన రాన
ట్టి ఘనజన్మదుఃఖము ల్బాపగా సద్గురుండోవు
నను చు । వేద వేదాంతము ల్వెదకి తత్సిద్ధాంత
పక్షమైనట్టి యాబ్రహ్మ విద్య॥ మూర్తీభవిం
చియు మొనసియున్నట్లుగా నున్న సద్గురు జే
రి సన్నుతులను॥ యల చతుర్విధ శిశ్రూష లా
చరించి॥ కులము గోత్రంబు రూపంబు కూ
డ విడిచి॥ యిల్లు గాలంగ బయిటికి నేగునతని
పోలుపుదనరగ శిష్యుండు బలికె నిట్లు॥ ౧౯

ఉ॥ కన్నినన నాలకింపుమిక గామితదాయక విన్న
పంబులా । పన్నుడ నీదుసేవకును బాల్పడి
జేరితి నీకు మ్రొక్కెదన్। గన్నుల గారవించి
కృప గావుము కావుమ నాథ నాథ యో। వ
న్నుతిగాత్రి భక్తజనసారసమిత్ర భయంబు
బాపుచున్॥ ౨౦

వ॥ అని యిట్లభ్యర్థించిన గురువరుం డిట్ల
నియె॥ ౨౧

కం॥ అన్నాశిష్యోత్తమ మే। ల్విన్నాణంబైనబ్ర
హ్మావిద్యాస్పదమై। యున్నమహావాక్యార్థము।
పన్నుగ వినుమందు పూర్ణపద్ధతి దెలియున్॥

వ॥ అదెట్లంటేని వ్యష్టిత్వంపదవాచ్యార్థం
బులైన దేహేంద్రియప్రాణ మనోధర్మకర్మ గుణ
వికారంబులు నిరాకరించి తత్సాక్షీభూత శుద్ధ
చైతన్యంబు తన్నుగా నవలోకించి యంతట త
త్పదసమష్టివాచ్యార్థంబులు నిషేధించి యం
దుల సాక్షిస్వరూపంబైన యీశ్వరశుద్ధ పదా
ర్థంబు పరిశీలించి యుభయ లక్ష్యార్థంబులు
నొక్కటిగా విలోకించ ప్రత్యక్పరమాత్మైకస్థి
తిఠైమె త్రిపుటిరహితంబగు పరమానంద స్వరూ
ప సత్యజ్ఞానానంద నిత్యనిర్మలానంతంబులను

షల్లక్షణంబులచే కేవలశుద్ధచిన్మాత్రం బొప్పు ని
ది యఖండంబగు నెఱుకయని బ్రహ్మంబని చిదా
కాశంబని ప్రాజ్ఞులువచించుదురిదియు నిరాకాశం
బగు నిర్వాణంబునందు కల్పనామాత్రంబగు కి
రణవికాసంబే మృగతృష్ణాజలాభాసకు గారణంబ
గునటుల ప్రజ్ఞాన స్వరూపచిదాకాశమందు దాని
స్ఫురణయెయవకాశంబై త్రైలోక్యదర్పణ కల్పి
తాకల్పిత దృగాకాశ స్వరూప మిథ్యారూపం
బగు నెఱుక కల్పితమై యుదకంబు తరంగఫేన
బుద్బుదసీకరంబులవలె జగత్పరిణామలయంబు
లు నొందుచుండ నెఱుంగక నిరావరణపరిపూ
ర్ణాచలనిర్వాణం బొప్పునని చెప్పి మరియు నిట్ల
నియె॥ ౨౩

గీ॥ శుక్తియందున రజితంబు సూర్యదీప్తి। యం
దు జలములు రజ్జువునందు పాము। కల్పితము
లైనయట్లులగలిగి యెఱుక। లేనిదయ్యును
జగములుగా నెసంగె॥ ౨౪

వ॥ అనిన శిష్యుం డిట్లనియె॥

కం॥ లేనియెఱు కెట్టుగలిగెను। లేనిది లేకుండుగా
ని లెస్సజగములై। తానెట్టులొప్పె వంధ్యా।
సూనుని దత్కార్యములను జూడగ నగునే॥

వ॥ అని నామనంబు భ్రమవశంబునొందె నీ యనుభవంబు విదితంబుగా కృప నొప్పధించి సర్వభ్రాంతినిరసనంబు గావింపుమని ప్రార్థించు శిష్యుని గనుంగొని శ్రీ గురుండిట్లనియె॥ ౨౬

కం॥ లేనిమెరుకెట్లుగలదని। దానికి మూలంబు దెలియఁదలచి కనంగా। లేనిమెరుక లేకుం డును। దానిని దెలియుటకు నెట్లు దరమా చెపుమా॥ ౨౭

వ॥ కావున నీయనుభవంబు స్వానుభవ వేద్యంబుగాని వాక్కుచే వచింపను మనంబున దలంపన దరంబుగాదైనను నీవత్యంత భక్తిపరుండవగుటం జేసి వివరింతు దత్తావధానుండవై వినుము జగచ్చిత్రములకు నిలయమైన చిదాకాశంబును గొడ్రాలినందు శశవిషాణంబు వలె సర్వభ్రమాలయంబై వస్తువును మరుగుజేయుట వస్తువును మరొకటిగా గనుపర్చుట యారెంటికి తానేకారణమని తెలియని లక్షణంబులతో నైంద్రజాలకంబులగు బాహ్యాంతర వస్తువులుగా దానేపరిణామమయి యావస్తువులను జూచు తరివస్తుజ్ఞానస్వరూపంబగు విక్షేపంబై వస్తువులను మరుగు పరచి యజ్ఞానావారణ రూపంబగు శూ

స్యంబై సూర్యుండు కిరణ ప్రకాశోష్ణంబులతో
గూడ నుదయించిన విధంబున తెలువు తెలివి తె
లియు తెలివి తెలియబడు నామరూపాత్మకంబగు
జగంబుతోగూడ మూలము లేని దృక్స్వరూపం
బగు నరుక కల్పితంబు గావున గనపడు జగంబు
లు గనెడి తెలివి చిజ్జడాత్మకమగు మెరుకస్వ
రూపమే యగునుగాన లేని తెలివికి లేనిజగంబు
లు లేకనే తోచుచుండునని చెప్పి మరియు నిట్ల
నియె ॥ ౨౮

సీ॥ విను చూచుచుండ నీవిశ్వంబులేదని యనుట
యెట్లనిన విను మరియు । మునుజూ
చుదానికే మూలమేమియు లేదు నామరూ
పంబు లందేమిలేవు । గాన దబ్బరయది దా
నిచే దోచెడి యీ చరాచర లోక మెల్ల
మిథ్య । కాబట్టి జగములు కా లేదు లేనిదే
కలదియై యొప్పు నిష్కారణముగ । లేని స్వ
ప్నంబు రీతిని లేకదోచె । లేనిదానిని లేదని
లేకగనిన । లేనిదే యనుభవంబు తాలేకనుం
డు । కలనువులిదోచి జాగ్రత నిలిపినట్లు ॥ ౨౯

వ॥ అనిన శిష్యుండిట్లనియె॥
సీ॥ తెలిపెడి తెలివేది తెలియు తెలివి యేది

తెలుపుము నాకిది తెల్లముగను । యన్నియు
లేనిచో నున్నదేమున్నది మున్ను పెద్దలు
గనియున్న దెద్ది । యున్నచో నున్నది యు
న్నట్టియుండును లేనిదెట్లయినను లేకపోవు।
బుణ్యపాపంబులు బొందువారెవ్వరు పొం
దకుండిన జేయు చందమునకు । నేమిఫలమిూ
విచారం బదెందు కనుచు । మనసు సంశయ
ములగూడి మసలుచుండె । నిన్నియును దెల్పి
సంతతిమున్న నిజము । నన్నుగా బోధ తెలు
పుము నాధనాధ॥ 30

ఆ॥ వె॥ ఎరుక శూన్యమనుచు నెరిగింప నెరిగితి।
గాని యింతమహిమ దీని కెట్లు। దేనివ
లన గలిగె దెలియంగ కరుణచే। దెలుప
వయ్య పరమదివ్యబోధ॥ 31

వ॥ అనిన గురువరుం డిట్లనియె॥

సీ॥ అనఘ త్రాడునుజూచి ఘనసర్ప మనుకున్న
తరి ద్రాడు తోచక దాగియుండు । మరు
పునందున బాము స్థిరముగా గనుపించు
నామ రుపావరణంబు పాము । విక్షేపమగు
ను దద్విధమున ప్రజ్ఞానమును నెరుగని మరు
పనెడి శూన్య। మనను నీ సకలంబు గనెడి

మూలములేని దృక్కు కల్పితమిది యక్క
జంబు । త్రాడు లేకవినుము త్రాడును గూ
ర్చిన । మరుపు నుండబోదు మరుపు లేక ।
పాముదెట్లు గల్గు పరికింపనది గాన । త్రాడు
నుండవలయు తథ్యముగను॥ ౩౨

వ॥ ఇట్లు త్రాటియొక్క మరుపనెడి శూన్యం
బున నేర్పడిన సర్పంబున కాత్రాడు వివర్తన
కారణంబై సర్పరూపం బై త్రాడును గప్పి నా
వరణంబై త్రాడు నాశ్రయించి త్రాడుచే ప్రకా
శింపుచు త్రాడు లేక నుండని విధంబున ప్రజ్ఞాన
స్వరూపాత్మ నెరుంగని మరుపున కావిజ్ఞానంబు
నిమిత్తంబై మరుపా విజ్ఞానంబు లేక నుండ
దందు కల్పితంబగు మూలములేని దృక్స్వరూపం
బగు నెరుకా విజ్ఞానము యొక్క వివర్తంబయి
విజ్ఞానమును గప్పి ప్రజ్ఞానముచే ప్రకాశింపుచు
నైంద్ర జాలికంబులగు బాహ్యాంతర వస్తువు లె
రుంగుచు నవ్వస్తువుల న్గప్పుమరుపు నెరుంగలేకా
కంటిని ప్రకాశింపజేయు విజ్ఞానంబును తాను
ను నొక్కటి గాక నవ్వస్తువులను తెలియు తరి
విజ్ఞానంబుతో నేకస్థితిగా నొప్పి తెలియుచుం
డునదియై త్రాటియొక్క మరుపు నందు దోచు

పాము తాడై యుండిన విధంబున పరిజ్ఞానాత్మ నెరుంగని మరుపునందు కల్పితంబగు నెరుక ప్రజ్ఞానంబేగాని యన్యంబు గాదదియునుం గాక ప్రజ్ఞానమును గురించిన మరుపు నాస్తియనంజను నానాస్తిని ప్రకాశింపజేయు పరిజ్ఞానంబస్తి యనం జెలంగు నీ యస్తినాస్తుల మిథ్యా తాదాత్మ్యాం బింతకు గారణంబగునని చెప్పి మరియు నిట్లనియె। 33

ఆ। వె॥ వినుము తెలుపు తెలివియన పరమాత్మ
చై। తన్యమగును తత్పదార్థ-మందు।
రనఘ తెలియు తెలివి। యనత్వంపదా
ర్థ-మా। ప్రత్యగాత్మ సుమ్ము వ్రావిమ
లాత్మ॥ 34

వ॥ అదెట్లనిన జీవేశ్వర జగత్తులను నానా చిత్రవిచిత్రంబులగు మార్పులకు గారణంబస్తి నెరుంగమి నాస్తి యయ్యస్తిత్వంబునంద వస్తువై మాయా విద్యాది పర్యాయ నామంబులచే సత్వ రజస్తమో గుణాత్మికమై వస్తువుగానొప్పి నానా చిత్రవిచిత్ర స్వరూపమైన రాజస గుణంబుచే సత్వ ప్రధానతమః ప్రధానంబు లను రెండు భాగంబులై యందు సత్వ ప్రధానంబు శుద్ధ సత్వ ప్రధాన మలిన సత్వప్రధానంబుల జెలంగుటచే

తమః ప్రధానంబుతో గూడ మూడు భాగంబుల లోను తమఃప్రధానంబు మిక్కిలిగా బరిణమించు నదియై మలిన సత్వప్రధానంబు తమః ప్రధానం బుతోడం గూడునదియై యిట్లు తమఃప్రధాన మలిన సత్వప్రధానంబులు తమతమ పనులు చేయు చుండునప్పుడు శుద్ధ సత్వప్రధాన మాత్మయొక్క యస్థిత్వంబుసం దునికిస్థితులు కలిగి పరోక్షంబు గానుండి యాయాపనులకు సత్త నిచ్చుచుండుమ. గాన జీవేశ్వర జగద్భేదంబులగు మూర్పు లాత్మ యొక్క యస్తిత్వంబున వివర్తంబగు చుండునని చెప్పి మరియు నిట్లనియె॥ 3౫

ఆ॥ వె॥ పరగ ప్రత్యగాత్మ పరమాత్మ తెలువులు।
దర్పణమున దోచు తనదు వదన। మేక
మయ్యు రెండు సేర్పడినట్లుగా। లేనిదృ
క్కుతోడ లేక గలిగె॥ 3౬

వ॥ అనిన శిష్యుం డిట్లనియె.

ఆ॥ వె॥ దర్పణంబునందు దగదోచు ప్రతిబింబ।
మునకు ముఖము బింబముగ వెలుంగు।
పరగ ప్రత్యగాత్మ పరమాత్మలును ప్రతి।
బింబులైన ముఖ్యబింబ మేది॥ 3౭

వ॥ అనిన శ్రీగురుండిట్లనియె దర్పణంబులేన ప్పుడు ప్రతిబింబంబు లేకపోవుచుండి బింబ ప్రతి

బింబ భావకల్పనంబులు లేక నొక్కటగు ముఖంబు మాత్రంబెటుల నుండునోయటుల మూలములేని దృగాకాశదర్పణంబు లేక కార్యకారణాత్మకమగు బింబప్రతిబింబ భావ కల్పనల భావంబై నిరాభాసంబైన వస్తుమాత్రంబు శేషించు నిట్లుమూలములేని దృగ్రూపంబగు నరుక తోచు తరి బింబ ప్రతిబింబా భాసకల్పనలచే రెండుగా నేర్పడి దృగభావంబున నిరావరణ పరిపూర్ణాచల సర్వకల్పనాధిష్టాన స్థితి నొప్పునని చెప్పి మరియు నిట్లనియె॥ ౩౮

గీ॥ గారడీమంత్ర సిద్ధుడౌ ఘనుడొకండు। రాజ
సభ జేరి తన శక్తి రహిజెలంగ। బహువిచి
త్రంబులైన రూపములు సూపి। లేక చేయు
ను యన్ని తా గాకనుండు॥ ౩౯

కం॥ తన కన్యంబేమియు లే। కను కాల త్రయ
మూలందు। గారడి వాడుండిన యట్లు దలచి
చూడగ। నవయ మధిష్ఠానముండు- నదియె
ట్లనినన్॥ ౪౦

వ॥ దృష్టాంతంబునందు గారడివానిచే పరికల్పితంబులైన నానా చిత్ర విచిత్ర జాలంబగు వస్తుజాలంబంతయు మిథ్యాభూతంబై తోచినను

గారడివాడు గూడ నట్టి పరికల్పిత వస్తువులతో పాటు మిథ్యారూపుడుగా జూడంబడ లేదు, కాన సర్వమును మిథ్యయైనను సర్వాధిష్ఠానంబు మిథ్యయని తలంచుట యుక్తంబుగాదని చెప్పి మరియు నిట్లనియె॥

గీ॥ కర్మసంగులు చేసెడి కర్మఫలము। లందుటకు స్వర్గ-నరకంబు లెందు గలుగు। నని మనంబున సంశయమును జనించె। నని యెదవు గాన దెలిపెదవినుము తెలియ॥ ౨౨

వ॥ జీవత్రయ, ఈశ్వరత్రియ, దేహత్రియ, లోకత్రయ, కర్మత్రయ, కాలత్రియం బాదిగా సర్వంబును స్వప్నస్థునకు స్వప్నకాలంబు సత్యంబై సుఖ దుఃఖంబు లనుభవంబగు చందంబున నొక జీవితకాలంబంతయు నిద్రానంతరము మెలకువ కనంతరంబు నిద్రయు వచ్చుచుండు రీతి వర్తమానదిన ప్రవర్తన తత్పూర్వోత్తర దిన ప్రవర్తనలకు కార్య కారణం బగునట్లూర్ణ నాభి తన ప్రవర్తనచే తాను చిక్కుపడుటకు తంతువేర్పరచుచున్నను తానది యెరుంగక ప్రవర్తించుచుదుదకందు చిక్కుపడు కరణి నొక జన్మంబులో నుండు చుండగా నేర్పడ్డ తనప్రవర్తన తత్పూర్వ జన్మ సంస్కార కార్యంబై ముందు జన్మంబునకు

సంస్కార రూపంబగు దేహం బగుచుండినను తనకు తెలియనిదగుచు నిట్లు పాన్యోపాసకో పాసనా తారతమ్యములచే దత్ఫల తారతమ్యములుగల జీవేశ్వర జగత్తులు వృత్తిచలన శక్తిలే స్వరూపముగాగల మూలము లేని దృగావరణాలయంబున విరాజమానంబు లగుచుండునని చెప్పి మరియు నిట్లనియె॥ ౪౩

క౦॥ అనఘా సంస్కారముచే। దనరు ప్రవర్తనము మరియు దద్వర్తనచే। తను సంస్కారంబేర్పడు। గన నివి యన్యోన్యకార్య కారణము లగున్॥ ౪౪

వ॥ కావున సంస్కారంబు జన్మంబునకు కారణంబగుచు నెంతవర కజ్ఞానం బంతవరకు సంస్కారంబు నశింపకుండు నందుజ్ఞానంబుచే నజ్ఞానంబు నాశనంబగుచు నందువలన సంస్కారంబు నశించుటచే కర్మనాశనంబై జన్మంబు నశించుటే మోక్షంబనిన శిష్యుండిట్లనియె॥ ౪౫

క౦॥ అయ్యా జ్ఞానంబనగను। నెయ్యది యెద్దాన గలుగు నెరిగింపుమనన్। వెయ్యేలవస్తుతత్వం। బెయ్యది యది తెలియు నెరుకయె జ్ఞానమగున్॥ ౪౬

వ॥ అది యెట్లంటేని మానసకార్యంబైన ర
జ్జువునందు వివర్తనంబగు సర్పంబు రజ్జువును తె
లియుటచే శూన్యంబైనయట్లు వస్తుతత్వంబు తె
లియుటచే జీవేశ్వరాది సర్వప్రపంచంబు శూ
న్యంబగు మరియు కార్యంబున కేగతియో కార
ణంబునకు నాగతి కలుగవలయున్గాన కార్యంబు
లగు రూపనామంబులు శూన్యంబులగుచుండ గా
రణంబగు మాయకు శూన్యత్వంబు సిద్ధించు గా
న నిట్టి శూన్యంబ వస్తువనందగు నీశూన్యంబు
ను ప్రకాశింపం జేయు. శేషించిన ప్రజ్ఞానంబె వ
స్తువనంబడు నిదియె సర్వకల్పనాధార వస్తుతత్వం
బిది తాసను నిజజాగ్రత కలుగువరకు సకలద్వం
ద్వంబులను నుల్లను దాటలేక జన్మచక్రంబున
జరించు చుండునని చెప్పిన శిష్యోత్తముండిట్లని
యె॥ ౮౭

ఆ॥ వె॥ బయలు బ్రహ్మమనుచు బల్కుదురెంత
యు। బయలనంగ నెద్ది బయలుబ్రహ్మ
మగుటయెట్లు దీని తగజెప్పుమనవుడు క
రుణ నిట్టులనియె గురువరుండు॥ ౮౮

వ॥ తనకాధారంబగు ప్రజ్ఞానంబునకన్న న
న్యస్వరూపంబులేక ప్రజ్ఞానంబుగాక శుక్తి కాదు
లయందు భ్రాంతిచే రజితాదులు ప్రకాశించు

రీతి ప్రజ్ఞానమందు దేశకాలక్రియలుగా భావమా
నంబగు మాయాశక్తియొక్క ప్రథమవికారంబై
బాహ్యాంతరంబుల స్థూలసూక్ష్మాతి సూక్ష్మరూప
నివహంబులకు నెత్తుపోడుగు లేనట్టు లేర్పడుట
కవకాశంబై యమూర్తానంత లక్షణంబులచే
దోచు నవకాశంబు బయలనంజను నీబయలాత్మ
లకభేదత్వంబును యాత్మయొక్క యథార్థ
పుటునికి బయలను నాకారంబుగ దోచుటయు
మాయా లక్షణంబగును. కంకణాదులకు కార
ణంబగు సువర్ణంబును బుద్ధిచే భిన్నపరువగా గం
కణాదులకు వస్తుత్వంబు లేనిరీతి నీయవకాశ రూ
పంబగు బయలును బుద్ధిచేత వేరుచేయగా బయ
లునకు స్వరూపంబు లేక నిస్తత్వంబు సిద్ధించుగాన
నెన్నండును బయలు బ్రహ్మంబుగాదు. ఇట్టి బ
యలును ప్రకాశింపంజేయు నస్తియగు స్వరూప
జ్ఞానంబు శేషించి బ్రహ్మంబన నొప్పౌననిన శి
ష్యుండిట్లనియె॥ ౪౩

సీ॥ పరిపూర్ణ మెప్పుడు నెరుక నెరుగకుండు న
రుకయు పరిపూర్ణ మెరుగకుండు। గురుమూ
ర్తి పరిపూర్ణ మెరిగించుతరి పరిపూర్ణమై తె
లిపెనో నిర్ణయింప। నెరుకమై తెలిపెనో
యెరిగింపు మిదిగాక పరిపూర్ణ మెప్పుడు బలుక

ఖుండు । నదిగాన పరిపూర్ణమై తెల్పుటా
ప్పుడు । మెరుక తానై తెల్ప నెరుకెయగును।
గాన పరిపూర్ణమెట్టులు గాను తెల్పు।సద్గురుం
డని మనమున సంశయంబు। గల్గినన్ గాన
తెల్పుముకరుణతోడ (వందన శతంబు లర్పిం
తు పొందుగాను॥ ౫౦

కం॥ విను శిష్యుడు స్వప్నస్థుం । డనియును మెల
కువను బోధ యచలాను భవం। బనువుపడ
దెలుపు ననియును। ననఘా బుధవర్యులను
దు రది సంశయమా॥ ౫౧

వ॥ ఎట్లంటేని రొయొక మనుజుండు సుప్తిని
బొంది స్వప్నంబు గనుచున్నతరి తత్సన్నిధానం
బున మరియొక మనుజుండు మేలుకొని యుండ
నయ్యిరువు రొకరికొక రభిముఖులై సందర్శన
సంభాషణాదు లొనర్పుట వశంబుగాదు. కాన
గురుండు మేలుకొని తెలుపుటయు స్వప్నస్థుం
డగు శిష్యుండు వినుటయు నెట్లు సంఘటిల్లునను
సంశయంబు నివారించి నిశ్చయస్థుని జేయుమని
(ప్రార్థించు శిష్యుని గనుంగొని పరమ కృపా
ళుండగు గురుం డిట్లనియె॥ ౫౨

సీ॥ నీ స్వప్నమున నేను నీవునున్నట్లు నే నన్నట్లు
మరి నీవువిన్నయట్లు । నీకు దోఁచినయట్లు
నిజదేశకుడు శిష్యునకు జెప్పు బోధాది సకల
ములును । శిష్యుని స్వప్నమై చెలగుచుండును
గాని గురుమూర్తి యేమియు నెరుగకుండు ।
శిష్యుని బోధించు శ్రీగురుమూర్తియు కలలో
న సింగంబుకరణి తాను । లేని వాడయ్యు
సకలంబు లేకచేయు । నున్నదే పూర్ణమను
తనయునికి దాని । కెరుక యవ్యతిరేకమైయు
లరుచునికి । మెరుక పరిపూర్ణమగు భేదమేమి
లేదు॥ ౫౩

వ॥ అనిన శిష్యుండిట్లనియె॥

గీ॥ జగము లజ్ఞాని కుండినట్లగుపడంగ । వేత్తలకు
గానరా నట్టివిధమదెట్లు । హరినికలగని చచ్చి
నకరిని బోలి । మెరుక గురుబోధచే లేక తిరుగు
టెట్లు॥ ౫౪

వ॥ వినవలతు నెజ్జెప్ప వేయని ప్రార్థించుశిష్యు
నిగనుంగొని దేశికోత్తముం డిట్లనియె॥ ౫౫॥

సీ॥ విను మొక యుపమానమును బాలురగు నిద్ద
రాటలాడగ జొచ్చి యందునొక్క । డాత్మ
ప్రదక్షిణ మనసాపుకరణి వేగిరమున గిరగిర
దిరుగుచుండి । భూమి మొదల్సర్వ భూతంబు

లగు చరాచరము లెల్లగిరగిరనుతిరిగె। వనుచు
రెండవవాని కనిననాతండపి మున్నున్నయట్లు
గానున్నపనిన। నీవుతిరుగుచు జూచిననిజము
గాను। సర్వమును దిర్గుచుండినసనణి తెలియు।
నమ్మునామాట మదిలోన నెమ్మితిరిగి। చూ
డు మన వానితో నిలుమన్నవాడు॥ ౫౬

గీ॥ కనుము నాప ల్కుబద్ధంబుగాదు నీవు। కూడ
నిలుచుండి తరువాత కొంతసేపు। నెమ్మదిం
చియు దీక్షింప నిఖిలములును। దిరుగకుండి
నచొప్పు నీకరయవచ్చు॥ ౫౭

వ॥ అని యిట్లా బాలురు వచించిరి మరియు
స్ఫురద్గమన వేగంబునఁ బఱుంగిడు ధూమశకటచ
లనంబు తత్సమీపాచలయందు నయ్యచలయ
చలత్వం బొశకటంబున బ్రకటంబై తత్రస్థుండ
గు మనుజుని కన్నులకు న్గానవచ్చుచున్నరీతి జీవే
శ్వర జగద్భేదంబులకుఁబాదనందగు శూన్యంబ
గు వస్తువునం దాత్మయొక్క యస్తిత్వాంశం
బొప్పాటచే గల్పితంబగు వృత్తిలోనున్న యస్తి
యగు తనకుఁ దనయస్తిత్వం బా శూన్యంబునం
దా శూన్యత్వం బస్తియైన తనయందునుఁ దోచి
జగదస్తియనందగి యజ్ఞానులు తమ చిత్తవృత్తు
లు నిలువలేక దేహేంద్రియాది సకల ప్రపంచం

బత్యంతసత్యంబుగాఁ జూచి వర్తింతురు. చండ
కిరణ ప్రకాశంబునం దెండమావులు గానంబడు
చుండెడి దిక్కునం దొక్కెడ నజ్కన్గత్రిడి యా
చక్కటికిన్జని కాండంబులులేక నెండయె యుండి
నన్గని మఱలితఱలి యెప్పటిదిక్కునకున్వచ్చి తప్ప
క వీక్షింపనప్పటికి చొప్పున నెండమావులు కండ్ల
కున్గపడి కానంబడినను నెండయేగాని యెండే
మియు న్లేదనుచు నిశ్చయంబెటులనో యటుల
వస్తుతత్త్వవిచారంబుచే దేశకాలాదులకు విలక్ష
ణంబగు స్వస్థితిమాత్రులై మరల దేశకాలాది
వ్యవహారవంతులైనను వస్తుతత్త్వ మాత్రమగు
తమ స్వస్థితి మారదను నిశ్చయంబున నాత్మవేత్త
లు నిలచియున్న బాలునివలెఁ దమచిత్తంబులు
తద్వృత్తులు నిలిపి తనకన్న నితరంబేమియు లేద
ని నిజంబెఱింగి రదియునుంగాక నిజము నిలకడ
మీఁదఁ దెలియునను నార్యోక్తి ననుసరించి యొ
క్కెడన్నిలచి వక్కాణించు బాలుని పలుకక్కు
వై యక్కజంబుగ నిక్కంబగునటుల వస్తుతత్త్వ
మాత్రి స్వస్థితిని సుస్థిరులగు పెద్దలమాటయె త
ద్దయు నిజంబుగావుననెట్లునుం బ్రపంచంబు పుట్ట
నే లేదేమియు న్లేదని చెప్పి మరియునిట్లనియె॥ గీ

సీ॥ గురుబోధచే లేని యెరుక లేకని దేహవంతులై
యుండియు సంతతంబు। వ్యాపారములనొప్పి
వ్యాపించుటెట్లన్న జగతియందు కులాలచక్ర
మూనకు। తగుకారణంబగు దండంబుదీసిన వ
డియున్నదాక మున్వలెనతిరుగు।చున్నను కా
రణశూన్యమై తిరిగినపద్ధతి సామాన్యపక్ష మి
దియు। నిటుల నీకు దోచెనిదియు వానికి లేదు
లేని యెరుక లేక లేకపోయె। లేనియెరుక నీ
కు లేకనే యున్నట్లు దోచితోచుకలలు తోచి
నట్లు॥ ౫౯

ఆ॥ వె॥ లేనియెరుక నతఁడు లేదని తెలసిన। వి
ధముదెలసి నీవు విడిచివేయ। దిరుగనడు
గ వనినఁదెలసి సత్సిష్యుండు పారవశ్య
మొంది యూరకుండె॥ ౬౦

శ్లో॥ పూర్ణాత్పూర్ణ పరాత్మా। పూర్ణపరాకాశ
జగదపూర్ణాధారా। పూర్ణేన పూరితాద్వ
య। పూర్ణవ్యాపార హితబోధాతీతా॥౬౧
నిరతిశయపరాత్మా। నిష్ప్రపంచా ద్వయా
త్మా। నిరుపమసుఖరూపా। నిత్యమోక్షస్వ
రూపా। పరమపద నిదానా। బంధమోక్షా
దిహీనా। గురువరయ శరీరా। గోప్యరూప
ప్రచారా।

గద్య॥ ఇది శ్రీసద్గురుప్రసాద లబ్ధకవితాకలిత భా
రద్వాజ సగోత్ర కామనామాత్య పుత్ర
వేంకటాచలపతి ప్రణీతంబైన పూర్ణ
బోధ సిద్ధాంత సారామృతంబను
ప్రబంధంబునందు ప్రథ
మ ప్రకరణము.

శ్రీ శ్రీ శ్రీ

సద్గురు దేవతార్ప
ణమస్తు.



శ్రీ

# పూర్ణబోధసిద్ధాంత సారామృతము

—:o:—

శా॥ శ్రీమత్కేవల నిర్విశేష విపరిచ్ఛేదాచలా
నంత స । త్తామాత్రాద్వయ నిష్కళంక ని
జబోధానంద సద్రూపమా । యామాత్రాం
చిత భూతభౌతిక ప్రపంచాభావభావాత్మచి ।
ద్వ్యోమాతీత పరాపరా సతత సద్యో
ముక్తి లక్ష్మీశ్వరా॥ ౧

గీ॥ అవధరింపుము సచ్ఛిష్యుఁడట్లుగాను । సమర
సానంద సామ్రాజ్య సరణినొంది । యంద
నాహతనాద మోదాంకురమున । బోధ వా
సనఁ బొప్పి ప్రబుద్ధుఁడగుచు । ౨

కం॥ గురువునకభిముఖుఁడై యతి । దరమరలేనట్టి
భక్తి నమరినవాఁడై । పరిచర్యలు నలుపుచు
మదిఁ దిరముగ శ్రవణాదులపుడు తెలుపుమ
నేఁ దగన్ । 3

క॥ ఇట్లు స్వపరిజ్ఞానాధతనొనంగు శ్రవణ
మనస్సిధిధ్యాసల తెరంగెరుంగంగోరు శిష్యుని
గనుంగొని శ్రీగురుం డిట్లనియె॥ ౪

గీ॥ వినుము శ్రవణాదులను నీకు విస్తరింతు । మ
నమునందున నభ్యాస మహిమవలన । నీవు
గనుగొని వాటిని నిశ్చయముగ । సావధాన
త విజ్ఞానసరణి నొందు॥ ౫

వ॥ అదెట్లనిన సద్గురుసేవాపరుండై సచ్ఛా
స్త్రంబులు శ్రవణంబు సేయుచుం దదభ్యాసంబున
జ్ఞానభూమికల నేడిటినభ్యసింపందగునవి యెయ్య
వి యంటేని ప్రథమంబు సుఖేచ్ఛయు ద్వితీయం
బు విచారంబునుం దృతీయ్యంబు తనుమానసం
బునుఁ జతుర్థంబు సత్వాపత్తియుఁ బంచమం బ
సంసక్తియుఁ షష్ఠమంబు పదార్థ భావనయు ।
సప్తమంబు తురీయంబు నను నీయేడును శ్రవణ
సంపాదితంబులు గావున నవి యెరింగించెద నాక
ర్ణింపుము. ౬

గీ॥ గురుని సన్నిధి శ్రవణంబుఁ గోరి వినుచు। న
రయు విజ్ఞానవాంఛతో నధికబుద్ధి । సరస న
చ్ఛాస్త్రవాసన ల్గువుచుంట । కరమది సు
ఖేచ్ఛగాఁ దొల్తఁ గాంచదగును॥ ౭

వ॥ ఇది ప్రథమాభ్యాసంబు దీనియందు స్థిరుం
డై నవాఁడు ద్వితీయభూమికారోహణంబునకుఁ జొ
చ్చి యందు పరిణత చిత్తుండై యుండు నదెట్ల
నిన॥ ౮

క॥ నేనెవ్వఁడ నీలోకపి । అంశము మున్నెట్లు
గలిగెఁ దగనిది నన్ను। స్దినిన్నేనును గూడిన
దానికి మూలంబు దెలియఁదలఁచుట యర
యఁగా॥ ౯

వ॥ మరియు దనుమానసంబను తృతీయభూమికా
లక్షణంబు నెఱింగించెద నాకర్ణింపుము॥ ౧౦

సీ॥ దేహేంద్రియప్రాణ ధీమనోహంకృతు లవి
తతంబుఁ దనుఁగప్పి సంచరింప। నజ్ఞానకోశం
బునందుండి స్వస్వరూపంబుఁ జూడఁగఁ గోరి
భావకలన । శశూన్యమగావింపఁ జొచ్చి యా
గురుమూర్తి యొలమినాత్మానంద మిచ్చినం
త। జిత్తంబునందునఁ జేర్చి తాభావించి యు
ది తామె యని చాల ముదితులగుచు॥

గీ॥ నున్నపుణ్యులు సతతంబు సన్నగాను । తను
వు సాధనకలనంబుఁ దమదియనక । యరసి
ప్రజ్ఞానరూప మేమంచుఁ జూతు। రనఘ తను
మానసం బన నదియు వెలుఁగు॥ ౧౧

వ॥ ఇందుఁ బ్రపంచంబు మిథ్యారూపంబుగఁ జూచి కార్యపరంబై యాభాసంబుగనుండు స్వాత్మానందంబునన్జొక్కియు నితర పదార్థంబులు కల్పనామాత్రంబుగ భావింపుచుఁ దత్కార్యాలోకనంబుల విముఖుండగుచు నాత్మానుసంధానంబు సేయుచుండునది సత్త్వాపత్తి యను నాలుగవభూమికయగు ద్వైతంబు తనయందు లీనంబగుచుండఁ బ్రపంచంబున భూతాక్రాంతుండైన వాని తెఱంగున నాత్మానందంబను సద్గ్రహగ్రస్తుండై తన్ను నవలోకించుచుండునది సంసక్తియనునయిదవ భూమికయగు సుషుప్తిపరుండైన పురుషుండు నిద్రాసమయంబున సర్వకార్యంబులు పరమంబగుచుండ దల్లీనుండై యుండియుఁ గొండొక తరిని వాసనావశంబున బ్రపంచంబు నెఱుంగుచందంబునఁ బదార్థభావనాపరుండైనవాఁడు సకల ప్రపంచంబు దానుగా భావించి తత్స్వరూపంబైన తన్నుమరచి పదార్థజ్ఞానరహితుండై చిత్తంబు జ్ఞానవాసనవశంబున నుఱల ప్రత్యుద్గమంబగునప్పుడు దృష్టపదార్థంబులు తనకంటె నన్యంబుగాఁ దోఁప నిది పదార్థభావనయను నారవ భూమికయగుఁ బ్రపంచాభాసంబులేక నిరంతర నిర్వికల్పంబుగ నుండునది తుర్యంబను సప్తమ

భూమికయగు నీభూమి కాసప్తకంబును శ్రవణ
సాధకంబులగు నంబుధియందు వీచీసంఘాతం
బుద్భవంబగుచునందున డిందునట్లు స్వయంప్రకా
శాఖండ స్వాత్మయందుఁ జిత్తానుసంధానంబు పొ
డముచు నాత్మాకారాకారితగతి నడంగునది మ
ననం బంబుధివీచులడంగ నిశ్చబ్దంబై యున్న తెరం
గున మనఃప్రచారంబు లేక చలనరహితంబై నివాత
దీపోపమంబై యుండునది నిధిధ్యాస భావంబిది
బ్రహ్మవిద్వరిష్ఠ దశావిశేషంబని యెరింగించి మ
రియు నిట్లనియె॥ ౧౨

ఆ॥ వె॥ పొలుచు శ్రవణమననములు నిధిధ్యాస
నల్ । భ్రాంతిలోనివనుచు బలికెశ్రుతు
లు । వినుము శ్రవణమెట్లు దనరున శ్రు
త్యర్థ । మైన తత్వమనుచు ననిరి బు
ధులు॥ ౧౩

సీ॥ అనయంబు బ్రహ్మంబ యమనన్యమగుటచే
మననంబు జేయరాదనగనొప్పె । తానైన
తత్వంబు తననిధిధ్యాసకు దగదని పలికిరి
తత్వవేత్త । లెరుక మూలాభావమేమియు లే
దని యెరుగుటే శ్రవణమా నెంచి చూడ ।
లేనిది యెరుకని లెస్సగా యోచించి మన
మునఁ దెలియుటే మననమగును । సర్వ

మున భావమనియెడి సరణి దెలియ। ఘన
నిధిధ్యాస మనఁగను గణనకెక్క। దనయ
హంభావరహితమే తగు సమాధి। యనిన
శిష్యుండు గురుమూర్తి కనియెనిట్లు॥ ౧౪

క౦॥ అనఘ సమాధిని సతతము। ననుకూలత
కలిగి యందు నలమిన మనముఁ। గన
నెందు లీనమౌ నది। ఘనముఁగ దెలియంగ
జెపుము కరుణను మరియున్॥ ౧౫

క౦॥ ఎన్ని సమాధులు భువిలో। నెన్నంగా బడె
డునవియు నెన్నివిధంబుల్। పన్నుగ జేయం
గ వలయు। నిన్నియుఁ దెలియంగ నాకు
నెరింగింపు టగ॥ ౧౬

వ॥ అనిన శ్రీగురుం డిట్లనియె సమాధులు
సవికల్పంబని నిర్వికల్పంబని రెండు విధంబులు
గాఁ జెలంగు నందు దృశ్యాను విద్ధయు శబ్దా
ను విద్ధయు నీరెంటికి ప్రత్యేకంబుగా నెరుంగ
దగు నవి యెటన్న సవికల్పదృశ్యానువిద్ధయు
సవికల్పశబ్దానువిద్ధయు సవికల్పంబున నీమూడును
సవికల్పసమాధు లిందులో బాహ్యాంతరంబుల
ద్వివిధంబై యొప్పు గావున సవికల్పం బారు విధం
బులై విలసిల్లు నిర్వికల్పంబును నిర్వికల్ప శబ్దాను

విద్ధయు నిర్వికల్పదృశ్యానువిద్ధయు నిర్వికల్పంబు నన మూడు తెరంగుల నొప్పు॥ నీసవికల్ప నిర్వికల్పంబులు వృత్తిభేదంబుల నవవిధ సమాధులని చెప్పంబడి యనుభవంబున కన్నియు నేకంబుగా వెలుంగునవి యెయ్యవి యంటేని॥ ౧౭

క౦॥ శబ్దముతో దోఁచియునా। శబ్దముఁ గన్గొనఁడి
మిగుల శబ్దముచేతన్। శబ్దాది క్రియల నొ
ప్పఁగ। శబ్దానువిద్ధయన బరఁగు సజ్జన
తిలకా॥ ౧౮

గీ॥ దృశ్యకరణంబులందున దెలివి గలిగి। దృ
శ్యగానుగాక కాదు నదృశ్యమున ను। దృశ్య
దృశ్యంబు తనయందుఁ దృశ్యమగుట। నది
యు దృశ్యాను విద్ధనాఁ బలరుచుండు॥ ౧౯

వ॥ గురుబోధ పరిణత చిత్తుండై యనృత జడ దుఃఖాత్మకంబు ప్రపంచంబు నిషేధించి యందుల శేషించు నస్తిభాతి ప్రియంబు లనేకంబుగా విలోకించుచు జగత్కాలనపరుం డగుచు బునః పర్యాలోచనంబున గల్పనామాత్రం బగు ననృతం బనృతంబగుచుండ దత్సాక్షిభూతుండనని తన్నుఁ వీక్షించుచుఁ బలుకుచుండునది యంత స్సవికల్ప సమాధి యనందగు నంతరంబున సర్వదృశ్యంబులకు సాక్షి స్వరూపకుంగా

నవలోకించి యుండునది యంతస్సవికల్ప దృ
శ్యాను విద్ధయగు బ్రహ్మంబుల వలన దన్ను
బోధించునప్పుడు తచ్ఛబ్దజ్ఞేయపరుం డయి యా
ధిదైవకుం డయి యుండునది యంత స్సవికల్ప
శబ్దానువిద్ధ మరియు చరాచరాత్మక మగు
సకల జీవులయందు గల రూపనాను గుణధర్మ
కర్మంబులు నానా భిన్నంబులై తోచుచుండ నవి
దృశ్యంబులని తెలిసియు వ్యవహార పరతచే
మమత్వభ్రాంతినొంది తద్బాహ్యశబ్దరూపంబుల
లీనుండయ్యును వాని యన్నిటియందు నేకత్వ
కలనమునం దానొక్కడే నిండియుండితి నని
యుండుటే బాహ్యసవికల్ప సమాధి. యిట్టి బా
హ్యసవికల్పంబున ననాదికాల మాయాజనితం
బగు దృశ్యంబుతోం గలసియు వాని వేరువేరుగ
నెరుంగుచుం దన్ని వేశిత జ్ఞానంబున మమేత్యభి
మానంబు నొందునది సవికల్ప బాహ్యదృశ్యాను
విద్ధయగు, మరియు శబ్దంబుల వ్యవహార ప్రసిద్ధి
నొందుచు, దల్లీనుం డయి యుండునది సవికల్ప
బాహ్యశబ్దానువిద్ధ యనంబరగు నీదృశ్య శబ్దం
బులు కల్పనామాత్రంబులు గావున సవికల్పం
బై విలసిల్లు నిక నిర్వికల్ప సమాధి యెట్లనిన॥
గీ॥ నిర్వికల్పమనగ నిశ్చయజ్ఞానంబు । పర్వ తన

కు నెపుడుఁ బగయుఁ జెలిమి। నిఖిలమయిన భూత నివహంబుతో లేక । సర్వమాత్మ గాను నెడి సమత వినుము॥ .౨౦

వ॥ అదెట్లన్న మనోరహితంబయి చిత్ప్రకాశ ఘనానందంబయి యుండునది నిర్వికల్పంబగు నిందు దృశ్యానువిద్ధ మెట్లంటేని సమాధి సమయంబున తన నిజస్వరూపంబునందు తా నానందించునప్పు డయ్యానందంబునం దానం దాకు గంబయి ప్రియమోదంబయి దృశ్యంబగుచుండు నది నిర్వికల్పదృశ్యానువిద్ధ యనంబడు మరియు నయ్యానందాంకురంబే స్వరూపోన్ముఖ స్ఫురణంబయి యనాహతనాదరూపంబయి పరావాక్యంబుగా శబ్దరూపంబున ఘోషించుచుండుఁ గావున నిది నిర్వికల్పశబ్దానువిద్ధ యనఁబరఁగు నీనిర్వికల్పదృశ్యశబ్దానువిద్ధలందు సవికల్పంబని కల్పనశబ్దంబులతో దృశ్యగ్రహణంబు నొంది యుండునట్లగుటం జేసి సవికల్ప నిర్వికల్పంబులు నాత్మజ్ఞులకారూఢావస్థ పర్యంతంబును వాసనారూపంబయి విలసిల్లు గావున నందంతర నిర్వికల్పంబున వస్తుకృత సంతోషంబుగాక వెలుంగుమని బోధించి యానచ్ఛిష్యున్గనుంగొని పరమ కృపాళుం డగు గురుమూర్తి యిట్లనియె॥ ౨౧

ఆ॥ వె॥ ఈసమాధులందు నెలమిఁ దద్విముఖత।
కలన విఘ్నములను గలుగఁ జేసి। గా
సిఁబెట్టి తన్ను వెసట నొందించఁ। గలవు
నాల్గువానికడిఁది వినుము॥ — ౨౨

వ॥ అవి యెయ్యవియుంటేని సమాధుల కం
తరాయంబులు గలిగించు లయవిక్షేపకషాయ
రసాస్వాదనంబులు నాలుగు విఘ్నంబులు గావున
వీనివేర్వేర నెరుంగఁదగునవి యెట్లంటేని విను. మ
నోవృత్తులు నిద్రాసమయంబున లీనంబు నొందిన
తెరంగున సమాధి సమయంబున సుషుప్తిఁ జెంది
వస్తుగ్రహణంబు మరచుట లయంబగుఁబ్రపంచవ
ర్తనంబగుట విక్షేపంబగు బ్రహ్మాను సంధానంబు
నందు మనంబు తూష్ణీంభూతంబుగా నుండునది
కషాయంబు వస్తుకృత సంతోషంబు రసాస్వాద
నంబు గావున నీనాలుగు నెరుంగుచు సమాధిసమ
యంబున నతిజాగ్రతయు సంకల్పవిజ్ఞప్తియు సకల
ప్రపంచ వాసనా పరిత్యక్తయు నాత్మానందలాభం
బును బ్రతిబంధ రహితచిన్మాత్రాఖండ స్వరూపా
ను సంధానంబునుఁ గలిగి నిరంతర నిర్వికల్పనిష్ఠా
తిశయంబున నుపకరణంబులై ప్రకాశించుచున్న
గతాయాత సంశ్లిష్టసులినతలను నాల్గింటిని నతి
క్రమించి కార్య కారణకలనంబగు వస్తువేకంబు

గ నిస్తరంగసముద్రంబు పోలిక నివాతదీపంబుతె రంగున వృత్తి రహితజ్ఞానంబున శేషభూతుండై యుండునతండు నేననిమెఱిఁగెడిమెఱుక కగువ డుచుండుచు నయ్యెడిమెఱుకయుఁ దనయంతన లీనంబునొందఁ బరిపూర్ణంబై యుండు నది విదేహ కైవల్య పూర్ణసమాధియని మెఱింగించిన నాశిష్యుండు గతాయాతసంశ్లిష్టసులీనత లెఱింగిం పుము. దానన్ మదీయచిత్తంబు నిర్మలంబగునని ప్రార్థించిన నాగురుదేవుండిట్లనియె।

సీ॥ నిర్వికల్పసమాధినిష్ఠయందునఁజొచ్చిమనసుత
దాకారమగ్నమగుట। గతముసాయాతముగ
ననందు లీనమా మనసు బహిర్ముఖమమరి
యుంట। నిర్వికల్పంబుగానెనఁగుసమాధిలోన్
వికల్పదృశ్య శబ్దములుకూడి। యుంటసంశ్లి
ష్టతయొంటియైతనయందుఁదన్నెరుంగకనున్న
తత్త్వరూప। మునమగలయునులీనత యనఁగ
నొప్పు। బన్నుగా తానుపాన్పునఁ బవ్వళించి। క
న్నుమోడ్చుచు నిద్రను గవసియవసిఁ యున్న
చందంబుభావనై యున్నదగును॥ ౨౫॥

శ్రీ॥ మరియునీఁదొక్క దృష్టాంతంబెఱింగించెద నాకర్ణింపుము పురుషుండు నిద్రాసక్తుండై శయ్యాతలంబున స్థూలదేహంబు డించినసమయం

బున సుప్తంబుగ్రిమ్ముచుండ నిమీలితాక్షుండై
తూష్ణీంభూతుండగువాఁడు నిజదారపరిగ్రహ తా
త్పర్యంబుగలిగియుఁ దత్సుఖంబునకు విముఖుండై
నిద్రాభంగంబునకు రోసి యింద్రియంబులనెఱుం
గక శరీరచేష్టాకలనంబు మఱచి నిద్రించినట్లు స
మాధి దశాప్రాప్తుండయిన యతండు గతాయా
తసంశ్లిష్ట సులీనత తెఱుంగుచు నెఱుంగకుండునది
యెట్లంటేని నిద్రాసక్తుండైన పురుషుండు స్థూ
లదేహంబు శయ్యాతలంబునఁ జేర్చినట్లానందం
బున మనంబు జేర్చునది గతంబగు నిద్రాసమయం
బున భార్యావిలోకనంబు జేసియుఁ జేయక యా
లింగనాది క్రియాకలాపంబు మనంబునఁ దోఁచి
యుఁ దత్సుఖంబునకు విముఖుండైన తెఱంగున
సమాధియందు మనంబు బహిర్ముఖ మగుచుండి
నను నెఱుంగకుండునది యాయాతంబు. మఱి
యు నింద్రియంబులన్నియు మఱచి నేత్రంబులు
మోడ్చి యెఱిఁగి యెఱుంగకున్న పురుషునట్లాత్మా
కారకారిత వృత్తిఁ గ్రీడించునప్పు డంతఃకరణంబు
బ్రహ్మాకారంబయి యుండితినను నిశ్చయంబెద్ది
కలదదియొసంశ్లిష్టస్థితియగుఁ బ్రపంచాభాసంబు లే
కయుండునది సులీనతభావం బిట్టిసమాధులయం
దనవరత బ్రహ్మలాభంబునొందుచు ద్రష్టవశ

ధంబులగు నింద్రియాంతఃకరణంబులు పొడవ
డంగుచుండ ధ్యాతృధ్యాన కలనాకలత్వం బెరుక
పడక సాంజనంబై నిరంజనంబై స్తిమితంబై గం
భీరంబై యుండునప్పుడు పాత్రసమానంబయిన శ
రీరం బాతపమధ్యంబున నున్నఘటంబు చందం
బున వికార రహితంబయియుండు నిట్లుండుట
మోక్షంబని వచించెదరు. మరియు నొక్క వి
శేషంబుగలదు, మూర్తి కలనంబు లేక నాకాశ
రూపంబై యుండు మనంబునందు చిదాదిత్యుండు
నంటక వెలుంగు నిట్టియాత్మకు మోక్షంబుచెప్పు
ట మృషావాదంబయియుండు నజ్ఞానంబున మో
క్షంబు వచించెద రెట్లనిన స్వర్ణనిర్మితంబులై స క
ట కాదులయందు స్వర్ణంబు చెడక యున్నను య
దార్థ దృష్టిని హేమవ్యవహా రాంగీకార మా
పాదించినట్లు మోక్షవ్యవహారం బెరుంగందగున
ని మరియు నిట్లనియె॥ ౨౬

గీ॥ ఇందుకంతర యజనంబు లందవలయు। మం
దబుద్ధు లెరుంగ రీమహిమ బోధ। యందుగ
నుంగొందు రంతగమందు లెస్స। సతతమా
త్మవిచారు లీసరణి వత్స॥ ౨౭

వ॥ అదెట్లంటేని, సమష్టి జీవశరీరంబునందం
తర్యామియైయున్న యప్పరమేశ్వరుండు వ్యష్టిశ

రీరాంతరస్థితుండై ప్రకాశించి వైశ్వానరుండను నామంబున ప్రవర్తిల్లి ప్రాణిభుక్తాన్నపానంబుల జీర్ణింపం జేయుచున్న యాత్మస్వరూపం బగున యవ్వైశ్వానరుండు స్థూలసూక్ష్మకారణ శరీరం బులను వేదికాత్రయంబునందు ప్రజ్వలితముఖుండై యాహవనీయ్యంబయిన స్థూల దేహతాదాత్మ్యంబువలన మానసేంద్రియంబుల నలిసి తచ్ఛరీరగోళకానుగతుండై ప్రాణపవన ప్రేరితుండై ప్రకాశించుచున్న యవ్వైశ్వానరునకు ప్రాణాపాన వ్యానోదాన సమానంబులు మనోబుద్ధులునుగూడి యీయేడును జిహ్వలుగాం బ్రకాశింపుచుండు నయ్యగ్నియందు మంతవ్య బోద్ధవ్య ఘ్రేయ భక్ష్య దృశ్య స్పృశ్య శ్రోతవ్యంబులను సప్తసంఖ్యలుగల సమిధలను మంతయు బోద్ధయు ఘ్రాతయు భక్షయితయు ద్రష్టయు స్ప్రష్టయు శ్రోతయు నను ఋత్విజులు ఘ్రియాదు లేడింటిని వ్రేల్చెడి సప్తహోత్రవిధానంబుగల యజ్ఞంబున యజ్ఞశిష్టామృతం బనుభవించందగు. మరియు దశహోత్ర విధానంబుగల యజ్ఞంబున బ్రీతుండయి వైశ్వానరు పదనంబులగు దిగ్వాతార్క ప్రచేతోశ్వినాగ్నీంద్రోపేంద్రమృత్యు ప్రజాపతుల ను దశదేవతలనల్ల గ్రహించబడు విషయంబు

లకు సాధనంబులయిన శ్రోత్రత్వక్చక్షు జిహ్వా ఘ్రాణవాక్పాణి పాదపాయూపస్థులను దశేంద్రియంబులను హోతలచే శబ్దస్పర్శరూప రసగంధ వక్తవ్య కర్తవ్య గమన విసర్గానందబులను హావిస్సులను క్రమంబుగా నాయాయింద్రియాధిష్ఠాన పురుషముఖంబున తానుపదిష్టుడై యాహుతులు సేయుటిది దశహోతృవిధానంబగు. మరియు నొక్కవిశేషంబువిను మిట్లుశుద్ధుండై యాత్మయజనం బాచరించు నప్పురుషవరుం డేతద్యజ్ఞంబునకు సర్వత్యాగంబు దక్షిణయిచ్చి యానందంబుగానుండు నది బ్రహ్మకర్మంబయి యుండు నిట్లాచరించు నతండు పుణ్యపాపవిధి నిషేధంబులకు వెలియైయుండుచు చిత్తవిపర్యయముః లేనివెలుగున సోమపానంబను స్వానందామృతం బనుభవించుచు బాహ్యాభ్యంతర విషయశూన్యుండయి యంబుధిమధ్యఘటంబుపోలిక బరిపూర్ణుండై పునరుద్ధాన రహితంబను నవభృథస్నానం బాచరించి కళ్యాణపరుండయి శ్రుతంబగు శబ్దంబు బ్రహ్మంబుగా విలోకింపుచు శ్రోత్రవర్తించు నతని చరిత్రంబులు వింతయైయుండు నిట్లాత్మదర్శనంబు ప్రకాశించు నిట్లుగాక బహిర్యజనంబుల గర్వులయి యున్నవారలకు జననమరణంబు

లు విడవుగాన నీవును దీనసావధాన చిత్తంబుతో నానందంబు నీవమై యుండుమని మరియు నిట్ల నియె॥ ౨౮

సీ॥ పరగ పంధ్యాపుత్రు పట్టాభిషేకంబు వర్ణిం చురీతిగా నిర్ణయించ్చి। లేకతోచినలోక పో కలందున నిట్లు పండితజనులచేఁ బలుకఁ బ డియె। గలనుపుత్రోత్పత్తి గలిగి మేల్కొను నంతఁ గల్లయైతోచిన కరణియగుచు। గురు చరణముపట్టి గురుమంత్రోపదేశ మొసఁగి నవానికి యేమిలేదు॥ ఆదిమధ్యాంత రహితం బు ననుపమాన। పరశివాతీత పరిపూర్ణపధి వి కితర పట్టులన్నియువిడినట్టి గుట్టునదియె పూర్ణసామ్రాజ్య మననొప్పి పూజ్యమగును।

గీ॥ మగఁడు జీవించియుండిన మగువఁజూచి। ముం డ తిట్లన్ని తిట్టిన ముండ యగునె। మాట మాత్రమె యెరుకను బూటకమనఁగా యు మెతానుగాఁదోచు మాయపోదు॥ ౩౦

సీ॥ కొందరుపెండ్లికై కోరిపోవుచు దారినేరడ్డమై యొడ్డునేరుసరికి। పెండ్లికుమారుఁడా పెన్నీటి వలనను గొట్టుకపోయినఁ గొందువజనులు। మ దినిదియాఖరు మంగళంబనియెంచి హారతులి

చ్చినట్లన్నిటంచుఁ । గర్తనభావంబు గనుకా
న్ప్రచాలును జగదీశ్వరాది విచారమునను ।
వినుము వేపాకు వేపాకెయనుచుఁ దెలిసి । న
విలినను చేదు తెలియక నవిలిచూడఁ జేదు
పోనట్లహాంబను పాదుపోక పొట్టుదంచిన వి
ధమున నొట్టిదగును । ३౧

సీ। ఎంచగురూక్తంబు కొంచంబనగరాదు కఠి
నంబులకునెల్ల కఠినమగుచు । మృదువులకెల్ల
ను మృదువుగానొప్పు నవ్విధమెట్టులనగను
వినుము చెప్పుదు । కఠిన వృక్షములనుగనియ
వితొలిచియు మృదువుగా నెంతయు బొదలు
చున్న । ఘనశిరీషసుమంబులను నొప్పచుం
డెడు । మకరందమును ద్రావు మధుపగుంపలె
తెలిసి గురువాక్యమందున నిలచినట్టి పుణ్యు
లకుగాక యబ్బునే పూర్ణబోధ । నాదములల
చేత నెరుకను లేదులేద । టంచునుండిన కొ
లదియు నట్లెయుండు । ३౨

వ॥ అనియిట్లు గురువరుండు దెలిపిన శిష్యుం
డు నిరస్తసమస్త సంశయుండును మాయావు
ర్మజ్ఞుండును నై సర్వంబును బ్రహ్మస్వరూపంబని
బ్రహ్మంబన తానన వేరులేకఁ నేకంబని స్వరూప

నిశ్చయజ్ఞానంబునం దానందమగ్నుండయి న
ద్యాన్యానందంబున కతీతుండయిన శాశ్వతంబగు న
మనస్కంబుగా నుండె॥ 33

క॥ ప్రత్యక్ప్రైక్యరూపా। నిత్యనిరాభాస సగుణ
నిర్గుణరూపా। సత్యస్వమాత్రరూపా। నిత్య
నిజానంద పరమనిష్కళదీపా॥

గద్య— ఇది శ్రీ సద్గురుప్రసాద లబ్ధకవితాకలిత
భారద్వాజసగోత్ర కామనామాత్యపుత్ర
వేంకటాచలపతి ప్రణీతంబైన పూర్ణ
బోధసిద్ధాంతసారామృతంబ
ను ప్రబంధంబునందు ద్వి
తీయప్రకరణము.

శ్రీ. శ్రీ. శ్రీ.

సద్గురుదేవతార్పణమస్తు.



గీ॥ అడవిసాంబసివ సమాఖ్యుడ । కవితాప్రసక్తి
గ్రంథరచన సలుపనేర్చినాఁడ । దీనిగూడనం
దండుసవరించినాడ నేర్పుకొలఁది బాడతోడ॥

క॥ ఇది బ్రహ్మవిద్యసారము । మదినేతద్గ్రంథకర్త
మహితానుభవా । స్పదుడై వ్రాసినయదికో ।
విదులిది మన్నించి చదువ వేడెద నెపుడుం॥

గీ॥ గ్రంథములునూచి నాల్గులక్షణములేరి । కై
తవంబుగ వ్రాసిన వ్రాతకాదు । స్వానుభవ
మునఁ బూర్ణ విచారణంబు । సలిపివ్రాసిన
గ్రంథము సత్యమిద్ది॥

